గోలకొండపత్రిక

సర్వధారి సం॥ర మార్గశిర శు॥౧౩ గురువారము

# దక్షిణాఫ్రికా భారతీయులు

తెల్ల జాతులవారికి తమ దేశాలు ప్రాప్తిగా చాలకపోయెను. ఈసం గతినివారు ౪౦౦ ఏండ్లక్రిందటనే గుర్తించిరి. అప్పటినుండియేవారుఒకరినిమించి ఒకరు మేలైన తుపాకులు మేలైన తుపాకీమందు మేలైన మారణయంత్రాలు, ఓడలు, వ్యాపార రహస్యాలు, రాజకీయ తంత్రమంత్రాలు అన్నీ సవరించుకొని ప్రపంచగోళముపై బయలుదేరిరి. అటు అమెరికాను ఆక్రమించుకొనిరి. పెరూ మెక్సికోలను ధ్వంసము చేసిరి. ఇటు హిందూస్థానమును ఆక్రమించుకొనిరి. చీనాను సగముఉత్తదాన్నిగా చేసిరి. శాంతిసముద్రము అశాంతిలో బడెను. వేనవేల దీవులన్నీ వారి వశమయ్యెను. ఆస్ట్రేలియాను వారే ఆక్రమించుకొనిరి. అందుమనుష్యుల తలలవేటలనుచేసి ఆదిమ నివాసులలో కొన్ని జాతులను “విత్తనం”కూడ లేకుండా చేసిరి. ఈవిధముగా ఎక్కడ సందుదొరికితే అక్కడ కాలుపెట్టిరి. కాలుపెట్టిన కొన్నాళ్ళకే దేశాధిపతులైరి. ఆఫ్రికానైతే తుంటలు తుంటలుచేసి తమ నామాంకితంచేసిరి. ఫ్రెంచిఆఫ్రికా, డచ్చిఆఫ్రికా, ఇంగ్లీషుఆఫ్రికా, బెల్జియం ఆఫ్రికా అని పలుపేరులుపెట్టి పంపకాలు చేసుకొనిరి. ఇంగ్లీషువారికి వచ్చిన భాగాలలో ముఖ్యమైనది ఈజిప్టుసోమాలీదేశము దక్షిణాఫ్రికా మున్నగునవి. మనకిప్పుడుదక్షిణాఫ్రికాకథఅవసరము. ఇంగ్లీషువారు బోయర్ జాతివారు గత శతాబ్దములో వివాదపడిరి. బోయర్లకు ఇప్పుడుమహారథుడై బ్రిటిషుసామ్రాజ్యవాదియగు స్మట్సుగారును బోథాగారున్నూ నాయకులై ఇంగ్లీషుసేనలతో యుద్ధంచేసిరి. తుదకు ఇంగ్లీషువారు వారికి డొమినియన్ హక్కునిచ్చిరి. అనాటినుండే ఇంగ్లీషువారు బోయర్లు ఒక్కటైరి. దేశమునేమో గెలిచి సిద్దీలను [ఆఫ్రికా నీగ్రోలను] పాలించినారు. కాని ఆదేశం చాలాఉష్ణదేశం. సముద్రతీర ప్రదేశాలను నివాసయోగ్యంగా చేయవలెను. వసతులుకల్పించవలెను. రైళ్లువేయవలెను భూములను పండించవలెను, గనులను త్రవ్వవలెను. అడవులన్నీ మాయంచేయవలెను. ఎన్ని పనులులేవు? ఇవన్నీ చేయుటకు హిందూస్థానం కూలీలైతే బాగుండేది అని అనుకొన్నారు. దానికిగాను బ్రిటిషిండియా ప్రభుత్వానికి నజరానా యిచ్చుకొని యిక్కడికూలీలను పిలిపించుకొన్నారు. అక్కడ మనకూలీలు కాలుపెట్టుతూనే వారి దాసులై పోయినారు. వారు చెప్పినంత చేయవలెను. ఇచ్చినంతతీసుకొనవలెను. వారు దొరలహోటళ్లలో ఉండరాదు. దొరలెక్కిన రైలుడబ్బాలలో ఎక్కరాదు. దొరలుండే వీధులలో ఉండరాదు. తెల్లమంగళ్లు తెల్లచాకళ్లు మనవారికి నౌకరీ యెంత యిచ్చినా చేయరు. ఈవిధంగా కష్టపెట్టినారు. కొన్నిసంవత్సరాలు మనమంది పనిచేసి ఆదేశాన్ని చాలా వృద్ధిచేసినారు. పనితీరింది ఇక వెళ్ళిపోండి అన్నారు- ఏమయ్యా మేమువచ్చి ౫౦ ఏండ్లయ్యెను మాతల్లిదండ్రులు అవ్వతాతలు ఇక్కడనేచచ్చిరి. మేమెక్కడికి పొయ్యేది అన్నారు మనవారు. పోరా? పోకుంటే జిజియా పుట్టుపన్ను గడ్డంపన్ను ఇయ్యండి అన్నారు తెల్లదొరలు. అంటే ప్రతిభారతీయుడు సంవత్సరానికి మూడు సవరనుల తలపన్ను ఇయ్యవలెను అని శాసించి వసూలుకు మొదలుపెట్టినారు.

ఇక్కడ కాస్తమనం ఆత్మమననం చేసుకొందాము. హిందువులు కర్మసిద్ధాంత మొప్పుకొంటారు. మనసనాతనులు తమకు రాజ్యాలు లేకున్నా సామ్రాజ్యాలులేకున్నా ఏమిచేసినారు. అంటరానివారిని సృష్టించినారు. వారు ద్విజుల వీధులలో ఉండరాదన్నారు. వారిని ముట్టమన్నారు. వారికి చాకలి మంగలివారు పనిచేయరు. వారిని దేవాలయాలలో రానీయరు. హోటళ్లలో రానీయరు. శూద్రులను ద్విజులు నేటికిని సాంఘికముగా కష్టపెట్టుచున్నారు. ఇవన్నింటికి మన హిందువులు [బ్రాహ్మణాదులుకూడా] దక్షిణాఫ్రికాలో కర్మ ననుభవించుచున్నారు. ఔరంగజేబు జహాంగీరు షాజహాను మొగలు చక్రవర్తులు జిజియాను జుట్టుపన్నును వసూలుచేసిరి. ఇప్పుడు భారతీయముసల్మానులుహిందువులతోపాటు దక్షిణాఫ్రికాలో తలపన్ను ఇచ్చుకొనవలసి వచ్చెను. ప్రతిదేశమువారు తమ ప్రజలకు విదేశాలలో అన్యాయం అపకారము అవమానంకాకుండా చూసుకొంటారు. కాని మన భారతీయులకు ఇంగ్లాండు హోటళ్ళలో అమెరికా సంయుక్త రాష్ట్రంలో, కనడాలో, ఆఫ్రికాలో అయ్యేఅవమానాలను ఎవ్వరు విచారింతురు. మనదిబానిసజాతి అందులో హిందూముస్లిం కలహాలతో నశించే జాతికి ప్రపంచములో గౌరవ ముంటుందా? దక్షిణాఫ్రికాలో ౬౬ లక్షల నీగ్రోలు, ౨౦ లక్షల తెల్లవారు రెండు౹౨ లక్షల మాత్రమే భారతీయులున్నారు, ఈ కొద్దినాటి భారతీయుల వల్ల తెల్లజాతికి నాశనం, అపకారం, అవమానం, నష్టం, కల్లోలం, ప్రపంచములోని ఘోరాలన్నీ తగులుకొని వస్తున్నవట పాపం. కుష్టురోగులను పరిహరించినట్లుగా వెళ్లిపొండి వెళ్ళిపొండి అని అంటున్నారు. ఈఘోరాలను విచారించుటకై మహాత్మా గాంధీగారు ౪౦ ఏండ్లక్రిందట ఆఫ్రికాకు పోయి తెల్లవారిచేసాక్షాత్తుగాతన్నులు తినెను. అచ్చటసత్యాగ్రహంచేసిజెయిలులోపడెను. వేల భారతీయులు జెయిలులోపడిరి. అప్పుడు తెల్లవారూ ఇంగ్లీషువారూ కండ్లుతెరచి ఏదో న్యాయం చేస్తాములే అని మాటయిచ్చి మళ్లీ మాటతప్పిరి- నేటివరకున్నూ అదే అన్యాయం జరుగుతుంది.

ఈసంవత్సరం భారతీయులకు ఒక హద్దు ఏర్పాటుచేసి ఖబర్దార్ దాన్ని దాటేరు. దాటినవారికి శిక్షలు జప్తీలు అగును. అని శాసించినారు. భారతీయులలో అన్నిశాఖలవారు లీగువారు హిందువులు క్రైస్తవులు, అధికారులు, అనధికారులు, అందరున్నూ ఈ ౫౦ ఏండ్లనుండిఒకేరోదనచేయుచున్నారు. ఎవ్వరున్నూ వినిపించుకొనరు. ఈసంవత్సరం శాసనసభవారు బిర్రుగా ప్రతిఘటన శాసనంచేసిరి. కాని ఏం ఫలం? భారత దేశానికి స్వాతంత్ర్యము వచ్చేవరకు భారతమాత పిల్లలు ఘో

---

# పంటల శాసనం రానున్నది

హైదరాబాదు వ్యవసాయ సహాయ మంత్రిగారగు సయ్యదు ఫజలుల్లాగారిట్లు అన్నారు.

“హైదరాబాదుప్రభుత్వమువారు ఒక శాసనం చేయుచున్నారు. ఇకముందు రాష్ట్రములో ప్రతి వ్యవసాయకుడు తన భూములలోని రెండుపాళ్ళ భూమిలో తినేధాన్యం పండించితీరవలెను. మిగతఒక భాగములో తనయిష్టంవచ్చినరానిపంటలు (అనగా అముదాలు, వేరుసెనగ, పొగాకు, నిటివంటివి) పండించుకోవచ్చును.

* *

ప్రభుత్వమువారు ధాన్యంధరలు తగ్గించుచున్నారు. జొన్నలు పల్లా ౧౪ తేక౧౫ రూ॥లకంటే ఎక్కువ అమ్మకుండా శాసింపబడును. ధాన్యం వ్యాపారంచేసే వారంతా ఇకముందు లైసెన్సు పొంద వలసియుండును. ఫజలుల్లాగారింకను ఇట్లు తెలిపినారు. ఇదివరలో బ్రిటీష్ఇండియాకు మనరాష్ట్రంనుండి ౨లక్షలటన్నులధాన్యం పంపు ఏర్పాటుండెను. ఇంతవరకు౨లక్షల టన్నుల ధాన్యం పంపబడినది. ఈరాష్ట్రం నుండి ఏటేట ౧లక్ష పశువులు బయటికి ఎగుమతిఅయినవి. ఇక ఎగుమతి అవుటకై ప్రభుత్వ మాలోచించుచున్నది.

## హైదరాబాదు రేడియో

తెలుగు కార్యక్రమం

రోటూ ౬-౫౫నుండి ౭-౫ నిమిషాల వరకు తెలుగులో వార్తలు ఈక్రిందివి ప్రతిశనివార సాయంత్రము ౫నుండి జరుగును.

మంగళవారం, ౭వడిసెంబరు ౧౯౪౮ నాడు వాయుదాడి రక్షణోపాయాలు, ప్రసంగం, మన ఆహారసమస్య, శ్రీరాంపల్లి విశ్వేశ్వరరావు గారు.

శనివారం, ౧౧వ డిసెంబరు ౧౯౪౮నాడు ఆంధ్రుల చరిత్ర, అర్థశాస్త్రం, శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు,

మంగళవారం, ౧౪వడిసెంబరు ౧౯౪౮ నాడు వాయుదాడిరక్షణోపాయాలు, ప్రసంగం, ఆంధ్రుల చరిత, అర్థశాస్త్రం, శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

శనివారం, ౧౮వ డిసెంబరు ౧౯౪౮నాడు కావ్యగానం, శ్రీదేవులపల్లి రామానుజరావుగారు.

# టప్పా రేట్లు రెండంతలైనవి

ము.ఘు.వ. నిజాంగారిఫర్మానుద్వారా హైదరాబాదు ప్రభుత్వము టప్పా రేట్లను చాలా పెంచినారు. ఇకముందు ౧౫బహమన్ ౧౩౫౮ నుండి యీ క్రిందివిధముగా రేట్లు వర్తించును.

కార్డు౧ కి ౭ పైయాలు.

కవరు౧ కి ౧అణా ౩పైయాలు. అదికూడా తులంలోగా ఉండవలెను. ఎక్కువుంటే ప్రతి తులానికి రూపాయీ లెక్కవ పెట్టవలెను. ౪౦ తులాల పార్సలుకు ౬ అణాలు అంతకంటే యెక్కువైతే ప్రతి ౨౦తులాలకు ౪అణాలు రిజిస్టరు ఫీసు ౩అణాలు. ఫీజాకు ౧౦౦కి ౪అణాలు. మనిఆర్డరు ౧౦ రూపాయీల వరకు ౨ అణాలు.

---

దేందుకలరో అందు ముఖ్యముగా ఆఫ్రికాలోని భారతీయుల ఘోర కష్టాలను ప్రతివిద్యావంతుడును తెలుసుకొని యుండవలెను. మన తెనుగులో దక్షిణాఫ్రికానుగూర్చి బహుగ్రంథములు వెలువడినవి. అవన్నీచదువుట అవసరము. మహాత్మా గాంధిగారు స్వయముగా వ్రాసిన దక్షిణాఫ్రికా చరిత్రను చదువని భారతీయవిద్యావంతుడు చాలా పొరపాటు చేసినవాడగును.

---

౧. సంతకాలు లేకుండాధాన్య గ్రహణంలో పటేలు పట్వారీల దౌర్జన్యాలను గూర్చి వ్రాయుచున్నారు అట్టి పిరికిమాతలకు తావులేదు.

౨. ఆంధ్రమహాసభ హైమల్లికార్జునరావు గారు వ్రాసిన వ్యాసముపై ౪-౫ ఖండనములు వచ్చినవి. ఈచర్చను ఆపివేసినాము. వాదోపవాదాలకు స్థలములేదు.

---

# విజ్ఞానవర్ధని.

## సర్వమూలం వ్యవసాయం

కాపుతనాన్ని మూలాధారభూతులని అందరున్నూ ఎరిగినారు కాని కాపులను పీడించుట ఆదికాలమునుండి రాజులకు రైతులకు అందరికీ అలవాటైనది. క్రీ. శ. ౨౩౦లో పర్షియాలో రాజ్యముచేసిన అర్దషీర్ (Artaxerxes) అనుచక్రవర్తి యిట్లుపలికి యుండెను.

సైన్యశక్తిలేదు ప్రభుశక్తికి మూలాధారము.
ద్రవ్యములేనిది సైన్యము ఏర్పడదు,
వ్యవసాయములేనిది ద్రవ్యము వ్రక్షకూడదు.
న్యాయములేనిది వ్యవసాయము సాగనేరదు.

మళ్లీ ఈయుత్తమన్యాయాన్ని కూడా కూడునని ఘోషించుమన్న ఈకాలపు ప్రపంచము ధర్మబుద్ధితో మననముచేసి ఆదరించుగాక.

## అభ్యాసమే అధికశక్తి

పూర్వంపర్షియాను బెహ్రింతనేరాజు పాలించుచుండెను, ఒకనాడు తనప్రియురాలితో మేడపై యుండగా దూరం మైదానంలో రెండు అడవిగాడిదలు కనబడెను. వెంటనే ధనస్సుసంధించి బాణం విడిచెను, రెండు జంతువులూ ఒకేబాణంతో నీల్గి చచ్చినవి. చూచినావా నాదెబ్బ అన్నాడు రాజు. ప్రియురాలు “అవునులెండి అభ్యాసం కూసువిద్య” అని అన్నది. రాజు గుర్రుమన్నాడు. రాణీ విడాకులిచ్చి వెళ్ళగొట్టినాడు. కొన్నిఏండ్లు గడచినవి. ఆమె జాడలేదు. ఒకనాడు రాజు వేటాడుచుండగా ఒక దృశ్యమునుజూచి దిగ్భ్రమజెందినాడు. అదేమనగా, ఒక స్త్రీ ఒక ఆవును తనమెడపై మోసికొని ఒక బురుజుమిద్దెమెట్లను ఎక్కుతూఉండినది. ఆమెనుపిలిపించి “అబలా, ఇది నీకెట్లు చేయగల్గితివి” అని అడిగినాడు. ఆమె మోముపైముసుగును తొలగించి “అభ్యాసంకూసువిద్య” అన్నది. ఆమె తనరాణియే, మరింత ఆశ్చర్యంతో విస్తరముగా విచారించగా “ఏమున్నది. ప్రవాసకాలములో ఇది చిన్నదూడగా నున్ననాటినుండి ప్రతిదినం దీనిని భుజముపై ఎక్కించికొని మెట్లు ఎక్కుటఅలవాటు చేసుకొంటిని” అని అన్నది. రాజు ప్రాధేయపడి తన రాణిని మరల స్వీకరించెను.

## మరాటీశుద్ధి

ఔరంగజేబు కాలములో నయానభయాన హిందువులను తురకలనుగా చేయుచుండిరి. అట్టి సమయములో హిందువులు పలుతావులలో తిరిగి హిందువులు కాదలచినవారిని శుద్ధిచేసి స్వీకరించుచూ వచ్చిరి. తులాజీభట్ జోషిఅనువాడు అగ్రకులుడై ముస్లిమయ్యెను. ఆకతీనతర్వాత బుద్ధివచ్చెను. పైఠణలోని బ్రాహ్మణపంచాయతివద్ద నమ్రుడై మతభిక్షను పెట్టుమని ప్రార్థించెను. వానికి ప్రాయశ్చిత్తముచేసి మరల మతమిచ్చిరి.

శాంబాజీ మహారాష్ట్ర చక్రవర్తిగా రాజ్యముచేసిన కాలములో గంగాధరకులకర్ణిఅనే మహారాష్ట్రబ్రాహ్మణుని బలవంతముగా తురకలు తమ మతములోనికి కలుపుకొనిరి. అతడు మరల కులపతి షత్తువద్దకు వెళ్ళగా వారు ప్రాయశ్చిత్తముతో వానిని హిందువునుగాచేసిరి.

---

# రష్యాకు ఇండియా నుండి సామగ్రులు

జర్మనుసేనలు రష్యాలోని కాకేసస్ ప్రదేశము మీద వచ్చిపడినసమయములో రష్యాకు యుద్ధసామగ్రుల సహాయముచేయుటకై బ్రిటిషు మిత్రమండలివారు అమెరికా, బ్రిటనునుండి పోవు సామగ్రులకు పడమటిపర్షియామార్గమును, ఇండియానుండిపంపు సామగ్రులకు తూర్పుపర్షియా మార్గమును నిర్ణయించిరి. తూర్పుపర్షియామార్గము ఇదివరలో ఒంటెలబారుల్యా కాలిబాటగా నుండెను. దానిని ౩౦౦౦కూలి పనివారును వారలపై తనఖీకి ౧౫ వివిధజాతుల అధికారులను పెట్టి మోటారులు ఉపయోగించు పెద్ద రోడ్డుగా చేసినారు. ఆనేకములగు వంతెనలు కట్టించినారు. కూలిపనిచేసిన స్త్రీలు చలిరోజులలోను. ఎండకాలములోను చలి, ఎండదెబ్బరక్షణకై ఎన్నో గంటలు విశ్రాంతిననుభవించవలసినవారలైరి. ఈ విధముగా రోడ్డు రామాసాలలో ముగిసెను. దీని పొడవు ౭౦౦మైళ్ళు ఈరోడ్డుమీదు ౧ ఇండియానుండి రష్యాకు యుద్ధసామగ్రులు ౧౦౦౦ లారీలలో పోవుచున్నవి. జనుము, రబ్బరు, రాగి, తగరము, పాదరసము ఇట్టి వస్తువులలో చేరినవై యున్నవి.

# గాంధిగారిధర్మపత్నికి గుండెబాధ

బొంబాయి ప్రభుత్వమువారు డిసంబరు౪తేదిన ఇట్లు తెలిపినారు;—

“ఈవారంలో శ్రీమతి కస్తూరిబాయ్ గాంధిగారికి రెండుసారులు గుండెబాధ కలిగినది. ఆమెకిప్పుడు కొంచెము నయముగా నున్నది. కాని యింకను ఆమె దుర్బలగానున్నది. ఆమెకోరగా, ఆమెకోమారులును, మనుమలు ఆమెను చూచుటకు ఇండియా ప్రభుత్వమువారు ఒప్పుకొనినారు.

# అమెరికాలో భారతీయులపై వెలి

తొలగించుటకై
ఇండియా ప్రభుత్వ యత్నము

అమెరికా సంయుక్త రాజ్యాలలో ఉండే భారతీయులకు అక్కడి పౌరత్వము లభించునట్లు చేయుటకై ఇండియా ప్రభుత్వమువారు యత్నించుచున్నట్లు క్రొత్తఢిల్లీలో అనధికారు లనుకొనుచున్నారట.

---

ముసోలినినిగూర్చి, చర్చిలుగారి మాటలు

# నాడు—నేడు

చర్చిలుగారిపుడు ముసోలినిని “నక్క” అనుచున్నారు. కాని ౧౯౨౭జనవరి ౨౦తేదిన రోం నగరమందు పత్రికాప్రతినిధులతో మాటుచెప్పిన మాటలు గమనించదగినవి. అవి ఈక్రిందివిధముగ నున్నవి:—

“ముసోలినిగారు ఎంతపనుల భారమున్నను, ఎన్ని ఉపద్రవములువచ్చియున్నను శాంతముగాను ధైర్యముగాను, నిరాడంబరుడుగాను ఉందురు. ఇది ఇతరులచేతులను ఆకర్షించినట్లే నన్ను ఆకర్షించినది. నేనే ఇటాలీయుడనైయున్నచో, నిజమైనహృదయముతోని పశుసమానములైనలోని కలతోను, భారములతోనుచేయుచున్న పోరాటమందు మొదటి నుండికొనవరకు మనఃపూర్వకముగా మీతో చేరియుండెడి వాడను.......కాని ఫాసిజంయొక్క అంతర్జాతీయ లక్షణమునుగురించి నేనొకమాట చెప్పెదను. మీఉద్యమము బయటప్రపంచమున కంతటికిని ఒకఉపకారముచేసినది. ...... సరియైన నాయకత్వమున జనులను ఒకటిగకూడదీసి, నాగరిక సంఘము యొక్క గౌరవప్రతిష్ఠలను ప్రేమించి రక్షించుకొనగోరునట్టుచేసే యేసమితియు, అరాజక విప్లవశక్తులను పోరాడగలిగినట్టియుమార్గ మొకటిగలదని ఇటలీచూపినది.

# మైసూరులో కూడా

ప్రభుత్వానికే
రైతులు ధాన్యమునమ్మవలెను

వ్యవసాయపు భూముల యజమానులు తమ భూములలో పండించెడి ధాన్యములను ప్రభుత్వమునకుతప్ప మరెవరికిని అమ్మకూడదని మైసూరు ప్రభుత్వమువారు డిసంబరు౪తేదిన అసాధారణమైన గజెటులో ఒకప్రకటనను చేసినారు. ప్రభుత్వేతరులకు అమ్మినను అవిక్రయము చెల్లనేరదు ఇట్టిఆజ్ఞకు కారణమును ఆగజెటు ప్రకటనలో క్రిందివిధముగా వివరణజేయుబడినది:

రాబోవుపంటలో భూముల యజమానులకు వారికుటుంబమునకును ఆశ్రితులకును: కూలిపనుల వారలకును అవసరమైనంతధాన్యమును ఒక్కొక్కనికి రోజుకి అర్ధసేరువంతున లెక్క కట్టి ఉంచి, వారలకు విత్తనములకును; ఇతర ప్రత్యేకావసరములకును కావలసినదానినికూడ యిచ్చివేసి; మిగత ధాన్యమును, అనగా, సాధారణముగా విక్రయించబడుచుండునట్టియో లేక దాచి యుంచుకొనబడుచుండునట్టిదియోఅగు ధాన్యమునంతయు ప్రభుత్వమువారే కొను ప్రకటించేధరలకు కొనవలెను. ఇట్లు ప్రకటించబడినధరలు ఒక సంవత్సరకాలము అమలులోనుండును. ఇట్లు చేసినచో ధాన్యము జనులందరికిని, ముఖ్యముగా దరిద్రులకు దక్కునని ప్రభుత్వమువారి విశ్వాసము.

## మన రైతు కష్టములు

శ్రీ కేశప్పగారు

మనరాజ్యము వ్యవసాయరాజ్యము కనుక మొట్టమొదట కృషికుల స్థితిని బాగుపరచుటయే ప్రభుత్వముయొక్క ముఖ్యకర్తవ్యము. మన హైద్రాబాదు రాష్ట్రమందు ఇంచుమించు ౬౦సంవత్సరములకు ముందు వ్యవసాయభూములు ఇప్పటివలె పట్టారూపములను దాల్చియుండలేదు. తర్వాత అప్పటిస్థితినిబట్టి ప్రభుత్వమువారు భూముల పట్టాలనిచ్చుటయే మేలనితలంచి, తత్సంబంధములగు శాసనములు చేసిరి. అట్టిశాసనములందు నేటివరకు ఏగొప్పమార్పులు లేక యథావిధిగానే యున్నవి. ఇప్పటి పరిస్థితులను బట్టిచూడగా తద్విషయమందు గొప్పమార్పు అవశ్యమైయున్నవి. కాలముతెట్లు మారుచుండునో అట్లే రాజులుగూడ అప్పుడప్పుడు మారుచుండు కాలముల స్థితిగతుల ననుసరించిశాసనములో తగుమార్పులు చేయవలెను.

౬౦ సంవత్సరములకు పూర్వము ఎప్పుడు భూముల పట్టాలనైనిచ్చిరో అప్పుడు మనరాష్ట్రమందలి జనసంఖ్య ఇప్పటి జనసంఖ్యలో సగమైనను లేదు, విద్యావంతులసంఖ్య ప్రతిశతం ౨ గూడ లేదు, వ్యవసాయమునకు భూమికి ఇప్పటివలె గౌరవము లేదు కచ్చేరీలు జిల్లాలు పట్టణములనగా అప్పటివారికేమో తెలియనే తెలియదు అందుచే పలుకుబడిగలవారు అనగా దేశముఖులు, జాగీర్దారులు, ముక్తేదారులు పటేలుపట్వారీలుసావుకారులు మొదలగువారు మేలైన భూములనెల్ల తమపేర పట్టాలు చేయించుకొనిరి. తక్కినవేవో కొన్ని సామాన్యజనులకివ్వబడెను. ఈవిషయమందప్పుడు కొంతవరకు బీదలకు మోసముగూడ జరిగియుండవచ్చును.

ప్రతిగ్రామమునకు భూస్వాములు ౩ గురు లేక ౪గురు మాత్రమే యుండుటచేత వారు స్వంతముగ కొన్ని భూముల సేద్యముచేసుకొని తక్కిన భూముల నన్నిటిని ఇతరులకు కౌలురూపముగా నిత్తురు. అట్టికౌలు సర్కారువారికి తెల్లించు శిస్తుకన్న (౫)దంతలు మొదలుకొని అచ్చటచ్చట (౧౦) అంతలవరకుగూడ కలదు. ఇట్లాభూమిలో పండిన పంట వారికే సరిపోను. ఇక రైతు సొంతి సేద్యముచేయువాని గతియేమి? మరికొందరు భూమిలోపండిన పంటనుండి సగం (కొన్నిచోట్ల మూడింట రెండువంతులుకూడ) ముక్తా—లేక పాలురూపకంగా వసూలు చేస్తారు.

భూస్వాములు తాము తమ భూమిని సొంతముగ దున్నుటయే లేదు. బీదలను జీతముపెట్టించుకొని వ్యవసాయము జేయించుదురు, కష్టమంతయు బీదలదే కాని ఫలమంతయు శ్రీమంతులదే. అట్టి బీదలకష్టములకిచ్చు ప్రతిఫలమతిస్వల్పము. వారికి నెలకొక్కంటికి రెండులేక మూడు రూపాయలనిత్తురు, ఒకపూటనో లేక రెండుపూటలలో పొట్టకన్నము పేయుదురు, వారికిడునట్టి అన్నము సంగతి వేరుగా చెప్పనక్కరలేదు; జీతము వాని కుటుంబపోషణకు సరిపోనందున అప్పులు జేయుచు ఉద్దరగింజలు తినుచు జీవితమంతయు వారికిలోబడియుండవలయును,

ఒకకౌలుదారు పొలమును ఎరువుచే సారవంతముగజేసి బాగుగ పంట పండించినచో వేరొకడు కౌలు ఎక్కువ నిచ్చెదననివచ్చును, పట్టేదారు ఎక్కువడబ్బు కాంక్షించుటచే పొలము ఒకనిస్వాధీనమందుండక, పలువురిపాలై దినదినం బలముతగ్గి పంటతక్కువనిచ్చును. లాభమేలేకున్న కాళ్ళు ఎందుకు పెంచుకరందురేమో; ఆ బీదలకు ఇదివిడచిన రెండవ ఉద్యోగమేలేదు; జ్ఞానశూన్యులౌటచే అధికసంఖ్యాకులగు కౌలుదారులయందు ఐక్యతకుదురదు; ఇదిఇట్లుండ పట్టేదారులకు విపరీతమైన కౌలిచ్చుటయేగాక ప్రభుత్వమువారికి యీబీదకౌలుదారులే ఎకరాకొక్కంటికి ౧, ౨ మణుములధాన్యము తామునిర్ణయించిన శాల్యప్రకారము నివ్వవలయునట. సమయమునకు వర్షములు కురియక పంటలు తగ్గినప్పుడు ప్రభుత్వమువారు శిస్తులయందు కొంతభాగము మాఫీల నిత్తురు, దానిచే పట్టేదారులకే లాభము, ఈ బీదరైతుల (కాస్తుకారుల) కేమియు లాభము లేదు శాసనములన్నను అమలులోకిరావు, ఇంతకుపూర్వము రాలేదు,

భూస్వాముల లాభాలు ఇంకాకలవు, వారు వడ్డీకిచ్చుటయు ఉద్దరగింజలనిచ్చి అధికలాభముల పొందుటయు, శ్రీమంతులౌటచే చదివి సర్కారు ఉద్యోగులో లేక వకీల్లోఅయి సతోమ పడుటయు, గొప్పగొప్ప వ్యాపారములు జేయు, సర్కారునుండి సహాయములు పొందుటయు కలదు,

ధనికులు బీదలరక్తమును పీల్చి అధికముగా ధనము సంపాదించి గొప్పగొప్ప విలాసవస్తువులకై వేలకొలది ధనమును వృధాగ వ్యయపరచి, వడ్డీకి వడ్డీకట్టి రైతులనుబాధించియో లేక అన్నదమ్ములను పాలివ్వకయో, డబ్బుకొరకైన, భూమికొరకైన కలహించి, దావాలు జేసి, గొప్పగొప్ప లంచాలనిచ్చి, తమప్రాణములకు ముప్పు తెచ్చుకొనుటయేగాక, బీదల ప్రాణముల పోగొట్టుచుందురు ఇందులేకదా ఇప్పుడు ప్రతి గ్రామ

## ధాన్యాగ్రహణం చాలాకష్టం

హైద్రాబాదు కర్ణాటకపరిషత్తు కార్యకారిణీ సభవారు ఈప్రకారము నిర్ణయించినారు.

ప్రజలుకోరినను సకాలములో భుక్తిసమాలోచనసంఘాన్ని ప్రభుత్వమువారేర్పాటుచేయక పోయిరి. ధాన్యాగ్రహణం ప్రభుత్వంచేయవచ్చును. రైతుకేవరైతేనేమి ధాన్యమమ్మాట ప్రధానమే కదా కాని ఈ మొనాపలుఏమిటి? మరి ధాన్యగ్రహణమేమిటి? ఇది నియంతల పద్ధతి. ఈ శాసనములో మార్పుఅవసరము. ఈ విషయమై ఆలోచించుటకు ఆంధ్రమహారాష్ట్ర కార్యకారిణీ సభలలో సంప్రతించవలెను.

ప్రజలకు వారిమాతృభాషలో విద్య చెప్పింపవలెనను ప్రజా విద్యామహాసభవారి నిర్ణయమును ఈసభవారు బలపరిచిరి.

మన రెండుమూడు పార్టీలయి విశ్వత చెడిపోవుచున్నది, ఎప్పుడు పెక్కండ్రు మహనీయులు నిర్బంధవిద్యకై కృషి సల్పుచున్నారు అది పల్లెటూళ్ళయందుండు అధికసంఖ్యాకులగు ఈబీద కౌలుదారులకు గొప్ప కష్టకారియె. ఏలయన తండ్రి కౌలుదారుఅయియో, జీతగాడుఅయియో కూలివాడుఅయియో, పైకారణములచేత కూడు గుడ్డలేక అప్పులపాలై సంవత్సరంలో ౬ మాసములే కడుగో, గంజియో కడుపునిండ భోజనము జేసి తక్కిన ౬మాసములు సగము కడుపుతో కాలము గడుపుచుండగా అతని సంతానము బడికి వెళ్ళినచో అట్టిసంతానమునకు అన్న వస్త్రముల నిచ్చుట మరియొక గొప్పకష్టముకదా! ఇప్పుడే ౭,౧౦ సంవత్సరముల వయసు రాగానే ఎవరికడనైన గేదెలకాపరియై బట్టలు లేకున్నను పొట్ట నింపుకొనుచు, ఇట్టి కుటుంబములు మన రాష్ట్రమందు ప్రతికతి ౮౦ తప్పక కలవు. జాగీర్లలో ముక్తాలలో సర్వము కౌలుదారులే గనుక వారి కష్టములు ఇంతింతని చెప్ప నలవికాదు,

ప్రభుత్వమువారు ఈ క్రింది నుదహరించిన మార్పులు బాగుండిన అమలుపెట్టగలరని ప్రార్థన.

౧ ఒకకర్షకుడు ఒకనాగలిచే తరీ ఖుష్కీ మొత్తము (౧౦) ఎకరముల పొలమును దున్ని దానికి తగినంతమట్టుకు ఎరువునిచ్చి మంచిపంట తీయగలడు, గనుక ఒకనాగలిగల ప్రతికర్షకునకు (౧౦) ఎకరములపొలముకన్న ఎక్కువ నివ్వరాదు.

వ్యవసాయకార్యములకై నెలకొక్కంటికి (౧౦) రూపాయలకుతక్కువ లేకుండ జీతమునిచ్చి పెట్టుకోవచ్చును.

జాగిర్దారు ముక్తాదారు పట్టేదారు మొదలగు వారు తమ భూమిలో స్వంతముగ వ్యవసాయము చేయలేక, కౌలుపై యిచ్చినచో అట్టికౌలురకము సర్కారిశిస్తునకు ఒకరూపాయకు నాలుగణాలవంతున ఎక్కువ నుండవలయును, కౌలురకం కాస్తుకారు దగ్గర సర్కారువారే వసూలుచేసి తమశిస్తుపోగ తక్కిన రూపాయకు నాలుగణాలవంతున పట్టేదారుకివ్వవలయును.

ఒక నాగలిగల ప్రతికర్షకుడు తక్కువకు తక్కువ మొత్తము అయిదుఆవులనుంచవలయును వాటిపోషణకై తగుప్రయత్నము చేయవలయును. చిన్నవయసుగల ఆవులను కటికవానికి కోయుటకై అమ్మినచో శిక్షనొసగవలయును,

ప్రతిగ్రామమునకు ఆవులబర్రెల మేతకై తగినన్ని పచ్చికబీళ్ళనిచ్చి గ్రామమునుండి అచటికి పోవుటకు త్రోవనొసగవలయును.

పటేలు పట్వారీలకు తగువేతనము లియ్యవలెను, వీరి విద్యకై ప్రతిమాధ్యమిక పాఠశాలయందు ౧-౨ తరగతుల నేర్పాటుజేసి ౩ వ తరగతి చదివినవారినే అట్టితరగతులయందు జేర్చుకొని విద్యనొసగి, సక్రమపరీక్షలతీసుకొని జయపత్రముల నివ్వవలయును,

ధనవంతులనుండి కొంతధనము వడ్డీరూపమున ప్రోగుచేసి ప్రతిగ్రామమునందు సహకారసంఘముల నేర్పాటుజేసి ప్రతిసంవత్సరము ఒక నాగలిగల కర్షకుకు తక్కువతక్కువ (౧౦) రూపాయలు అందుతప్పక జేర్చునట్లు ఏర్పాటుజేయవలయును అట్టిధనము నుండి కర్షకులకు వ్యవసాయకార్యములకు తగువస్తువుల కొనుటకై తక్కువవడ్డీపై అప్పులనివ్వవలయును. ఇట్లే కొన్నిసంవత్సరముల వరకు పైసంఘముస్థితిని బాగుచేసి తగినంతధనము నిలువయుండు సమయము వచ్చినపుడు కర్షకుల ఇతర కార్యములకు అనగా గృహములుకట్టుటకై వివాహములుచేయుటకై అప్పులనిచ్చు నేర్పాట్లు చేయవలయును,

ప్రతిగ్రామమందుధాన్యపు కొట్టములనిర్మించి ప్రతిసంవత్సరము ఎకరాకొక్కంటికికొంతధాన్యము జెల్లపైతీసికొని, నిలువయుంచవలయునను, ఇట్లుయిన చోకర్షకులకది అలవాటైయుండును వ్యవసాయమేతరు పదిండిధాన్యము సునాయాసముగదొరుకును, ప్రభుత్వమునకు సమయానుకూలమౌను.

## హైదరాబాదుకు జలవిద్యుత్తు

### యుద్ధానంతర పునర్నిర్మాణములో ఒక అంశము

సర్ ఏ. రామస్వామి మొదలియార్ గారి సూచన

ఇండియా ప్రభుత్వపు సరఫరాశాఖ మంత్రియగు దివాన్‌బహదర్ సర్ ఏ. రామస్వామి మొదలియారుగారు గతనవంబరుమాసపు ౨౩ తేదిన హైదరాబాదు (దక్కన్) నగరమందు బాగిఆమ్మాలో టౌనుహాలులో మ. ఘ. వ. నిజాం ప్రభుత్వముయొక్క యుద్ధానంతర పునర్నిర్మాణ శాఖవారి ఏర్పాటున 'యుద్ధానంతర పునర్నిర్మాణము' అను విషయమునుగురించి ఉపన్యసించిరి. మ.ఘ.వ. నిజాంప్రభుత్వ ప్రధానమంత్రి ఛతారి నవాబుగారు అధ్యక్షతవహించిరి. రామస్వామి మొదలియారుగారి ఉపన్యాసమందలి ముఖ్యభాగములిక్కడ సంక్షేపముగా ఒసగబడుచున్నవి.

మనదేశంలో ఏమైనను కొద్ది బొగ్గువిక్కినచో అవి ఈదేశమందలి ఈశాన్యభాగమందేవిద్యుచ్ఛక్తి తీయు అవసరాలకు సరిపోదు. కాని అదృష్టవశమున నీటితో విద్యుచ్ఛక్తినితీయుటకు మనకుసాధ్యమగును అయ్యంగారి ప్రయత్నమువల్ల పెరిగినది. ప్రపంచములో మరెక్కడగాని జలవిద్యుచ్ఛక్తి మాటనుగురించి అనుకొనకయుండే ఈపరిశ్రామిక మైసూరులో చక్కగా వృద్ధికివచ్చినది, మనము హిమాలయ పర్వతమునుండిదార్జిలింగు వరకుగల జలపాతములను స్మరించనేస్మరించము,

మనము గడచిన ౫౦౦౦ ఏండ్లుగాకూడ గంగానది ప్రవాహపూరితమునైన ప్రదేశములనుగురించి అనుకొననేలేదు. తుదకు దక్షిణ హిందూదేశము మేలుకొన్నది. మదరాసు రాష్ట్రములో మెట్టూరు పాపనాశనము; తిరువాన్కూరు సంస్థానమందు పల్లివాసాల్; మైసూరుసంస్థానములో కావేరిజలపాతము, జోగ్ జలపాతము—ఇవి జలవిద్యుచ్ఛక్తిని తీయుటకు ఉపయోగించబడుచున్నవి హైదరాబాదుకూడ ఇందుకుఉపక్రమించి దక్షిణహిందూదేశపటమును ఎందుకుపూర్తిచేయరాదు? అట్లుచేసినచో హైదరాబాదులో ప్రజలకుచౌకగా విద్యుచ్ఛక్తి లభించుటయేకాక, ఇక్కడ కుటీర పరిశ్రమలను పెంపొందించుకొనగలుగుదుము.

### వ్యవసాయము

ఇక వ్యవసాయము దీనిని గొట్టపుబావులను త్రవ్వించి బాగుచేసుకొనవచ్చును. అట్లు చేసినచో ఆపుడుమనము నిస్సారమగుచున్నభూమి ఇంకను ఎంతయో సాగుబడికిరాగలదు. స్కాట్లండు దున్నుటకు సాధ్యముకాదని ఒకప్పుడు అనుకొనిరి కాని అక్కడిమనుష్యులు పట్టుదలకప్రయత్నముచేసి తత్ఫలితముగా ఇపుడు అక్కడకొన్ని రాళ్ళప్రదేశములుతప్ప తక్కిన ప్రదేశమంతయు సేద్యముచేయుటసాధ్యమైనది. తరు న్యూర్కులో ప్రవాహములలో మునిగిపోవుచుండు ప్రదేశములను సేద్యముచేయు ప్రయత్నముకూడ సఫలమైనది. అక్కడ తినులేప్రమునకు ఆల్ఫ్స్‌ముక్కీని మధ్య అరడుగులనీరు ఉంటుండేది. ఇపుడుఅక్కడి భూములు సేద్యము చేయబడుచున్నవి. ఇతరదేశములతో పోల్చిచూడినచో, అక్కడ ఎకరముంకి పండించేపంటలో మనము మూడవవంతు లేదా నాల్గవవంతును మాత్రమే పండించుచున్నాము. వారంత ఎక్కువ ఎట్లుపండించగలుగుచున్నారు? ఎందుకనగా వారలు రసాయనక్రియలను యంత్రములను ఉపయోగించుకొనుచున్నారు. వారలు అమ్మోనియం సల్ఫేటును, ఇంకను ఎక్కువపంట పండించుటకు కావలసినఇతరమార్గములను అవలంబించుచున్నారు. ఈ రసాయనపదార్థములను మనము ఉత్పత్తిచేయకపోవుటయేగాక వాటిని ఇతరదేశములనుండి ఏమాత్రమైనను ఎక్కువగా తెప్పించుకొనుటకూడ లేదు. యుద్ధప్రయత్నమునకు ముందు ౩౦౦౦౦టన్నులనుమాత్రమే తెప్పించియుంటిమి. దానిలో ఎక్కువభాగమును తేయాకు కాఫీ, రబ్బరు, తోటలవారే ఉపయోగించిరి అప్పుడప్పుడు కొందరు చెఱకుపంటలకు ఉపయోగించిరి. చెఱకుపంటలవారికి వాటివల్ల లాభము బోధపడినది. కాబట్టి యుద్ధానంతర సమస్యలను విచారించుసంఘములు ఆలోచించవలసిన గొప్ప సమస్యలలో అమ్మోనియం సల్ఫేటును ఉత్పత్తి చేయుటకు సంబంధించినదిఒకటి. యుద్ధానంతర ప్రణాళికలన్నిటిలోను ముఖ్యాతి ముఖ్యమైనది విద్యుచ్ఛక్తి ప్రణాళికయని నేను మరల నొక్కి చెప్పవలసియున్నది. ఎక్కువగా లభించినచో అమ్మోనియాసల్ఫేటుతోపాటు జిప్సంకూడవాడి మొత్తం ౭లక్షల గ్రామాలలో మనసేద్యముయొక్క పునాది సంఘటనను గట్టిపరచవచ్చును. మనదేశములో వ్యవసాయమును పరిశ్రమలను బాగుపరచవలెనంటే విద్యుచ్ఛక్తి సమృద్ధిగా దొరకవలెననే నిర్ణయానికి వచ్చితిని. నేనీసూచనను ఇండియాప్రభుత్వమువారితో ఇదివరలోనే తెలిపియున్నాను; ఇపుడు మ.ఘ.వ. నిజాంప్రభుత్వమువారికిని తెలిపినారు. మ.ఘ.వ. నిజాంప్రభుత్వమువారు దీనికి పూనుకొనినచో మీరాష్ట్రము ఎంత అభ్యుదయముగ నుండగలదు? హైదరాబాదుసంస్థానమునకు జలవిద్యుచ్ఛక్తి చాల ముఖ్యమని నేను చెప్పెదను. అది కష్టసాధ్యమే కావచ్చును. కాని దానివల్ల వృద్ధిచెంది ప్రజలకును రాష్ట్రమునకును అనుభవమునియగల ఇతర ముఖ్యపరిశ్రమలనుగురించి ఆలోచించుము.

### సంఘపునర్నిర్మాణము

ఇక పునర్నిర్మాణము సంగతిగురించి చర్చించెదను. రోగుల జీవితములను కాపాడుటకును, స్త్రీపురుషులకు విద్యనేర్పాటుచేయుటకును, స్త్రీలకు ప్రసూతికాల నేర్పాటు చేయుటకును, స్త్రీపురుషులకు చికిత్సాలయము కట్టించుటకును చేయవలెనని చెంతయొకలదు. మ.ఘ.వ. నిజాంప్రభుత్వము యొక నాయకుల గౌరవమునకు భంగమురాకుండ నేను హైదరాబాదంతటి పెద్దనగరంలో నాలుగు మాత్రమే ప్రసవశాల లున్నవని వినినపుడు ఇదేమిరా ఇంతే ననిపించినదని నన్ను చెప్పనిత్తురుగాక.

[దక్కన్ క్రానికల్ నుండి]







## నీటి పంపకం వివాదం

ఆలు లేదు చూలు లేదు కొడుకుపేరు సోమలింగం అన్నట్లుగా రా ఏండ్లనుండి తుంగభద్రా ప్రాజెక్టు కాగితాలమీద కట్టబడుతున్నది. అట్టి అంచనాలకు పరిశీలనకు ఖర్చు కాకేతుయున్నవి. హైద్రాబాదు మద్రాసు ప్రభుత్వాలవారు తుంగభద్రకు ఆనకట్టకట్టితే ఖర్చు లెవరెవరు ఎంతెంత భరించవలెనని కొన్నిరోజుల్లో వివాదపడిరి. ఏదోవిధంగా పరిష్కృతి యయిందనిరి. యుద్ధంపుణ్యాన ప్రాజెక్టు కాగితం అంచనాలుకూడా మూలపడెను మళ్లీ యిక్కడొకవార్త బయటపడినది. మద్రాసు హైద్రాబాదు ప్రభుత్వాలు ఆనకట్టకట్టితే ఒకరొకరు నీరెంతతీసుకోవలె అని కొట్లాడుకొన్నారట. భాయీ మనమెందుకు కొట్లాడుకోవలెను మధ్యగా పసందుచేసిన జడ్జీలకు దీని పరిష్కారం వదలుదాము అని మద్రాసు ప్రభుత్వం అన్నదట. హైద్రాబాదువారేమో సరేసే అన్నారట, కాని ఢిల్లీప్రభుత్వం ఇంకా సెలవు ఇవ్వలేదట.

హైద్రాబాదు ప్రభుత్వంవా రిట్లు శాసించుచున్నారు.

సజ్జల నిరోధశాసనం జారీఅయినది, అది నిర్దిష్ట ప్రదేశాలలో అమలులోనికివచ్చును. అట్టి స్థలాలలో సజ్జలను ఎవరికిన్ని అమ్మకూడదు. ఒక్క హైద్రాబాదు కమర్షియల్ కార్పొరేషన్‌వారికే అమ్మవలెను.

* *

౧౫ డిసెంబరువరకు హై. రాష్ట్రములోని బట్టలవర్తకులంతా లైసెన్సుపొందవలసియుండును అని బట్టల కమిషనర్ ఆజ్ఞ యిచ్చినారు.

* *

శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ విద్యాపీఠము అనేది బెజవాడలో స్థాపించి కొన్ని రోజులనుండి పనిచేయుచున్నది. దాని వార్షికోత్సవములో శ్రీ విశ్వకవిరాజు సరిపల్లె విశ్వనాథశాస్త్రి ఎం ఏ. గారు పాల్గొనినారు. ఆపీఠానికి బెజవాడవాస్తవ్యులు వైశ్యపుంగవులును అగుచుండిరి. వెంకటరెడ్డిగారు ఒకలక్షరూపాయీలను దానముచేసినామని సభలో ప్రకటించిరి.

* *

### గౌడ కుల సంఘము

పై సంఘానికిగాను నారాయణగూడములో ౬౦౦౦గజముల భూమి ఖరీదు చేయబడినది. వసతిగృహనిర్మాణమునకై ప్రయత్నములు జరుగుచున్నవి హైద్రాబాదు నగరములో మద్యపానదుకాణములో అమ్మబడు కల్లుపైడ కొకటికి అర్ధణావొప్పున ధర్మాదాయం వసూలు చేయుటకు వ్యాఖ్యానములు చేయుబడినవి.

# భారత దేశం ఆహారంతో తృప్తిచెందదు

## రాజకీయ స్వాతంత్ర్యము అవసరము

### బ్రిటిషు పార్లమెంటు సభ్యుని సమర్థనము

బ్రిటిషు పార్లమెంటులో లేబర్ పార్టీకి జెందిన సభ్యులగు కోవు గారు నవంబరు ౩౦వ తేదిన లండను నగరములో తాను అధ్యక్షునిగ గల భారతీయ క్షామసమితియందు ఉపన్యసించుచు భారతదేశము ఆహారముతో తృప్తి జెందదనియు, రాజకీయ స్వాతంత్ర్యమును దానికీయవలెననియు చెప్పిరి. భారత దేశపు నాయకులు జయిళ్ళలో నున్నంత కాలము ఆ దేశము నకు బ్రిటనుపై ఆదరణ ఉండ జాలదనిరి.

పూర్వపు వైస్రాయి ఎక్కువ దూరదృష్టితో పనిజేసిరనిగాని, ఇండియాయెడ సానుభూతివహించి రనిగాని నాకనిపించలేదు. ఇంగ్లాండు చూచిన వైస్రాయిలలోకెల్ల ఆయన మిక్కిలి దాక్షిణ్య హీనుడైన కర్కశవైస్రాయి యని నాకనిపించినది. అమెరీగారికైనను దయారస మున్నట్లు నాకనిపించదు. ఈపరిస్థితికి ఎవరైనా పురుషులు బాధ్యులనవలసినచో వారలు పూర్వపువైస్రాయి, అమెరీగారును అయియున్నారు. జరిగినదానికి ఇరువురిపై గూడ తప్పుపట్టవలసినదే. ఇండియాలో ఆహారమునుగురించి భయపడవలసిన అవసరములేదని అమెరీగారు కామన్సు సభవారికి అభయమిచ్చి ఎన్నియో నెలలు దాటలేదు. తర్వాత కొద్దికాలానికే ఇండియాలో క్షామము తాండవమాడుచున్నది." అని కోవ్ గారు చెప్పిరి.

---

# బొంబాయిలో బస్సుల ప్రయాణికులకు

## పోలీసు ఆజ్ఞ

బొంబాయినగరంలో ఒకచోటినుండి ఇంకొకచోటికి బస్సులలో పోదలచు ప్రయాణికులు అందరును బస్సులవద్ద ఒకరివెనుక ఒకరు వరుసగా నిలచియుండి దిగదలచినవారలుదిగిపోయినతర్వాత ఒకరివెనుకఒకరు ఎక్కవలెనని బొంబాయి నగరపు పోలీసుకమిషనరు ఆనగరపు పోలీసు శాసనము ననుసరించి ఆజ్ఞ చేసినాడు; ఈఆజ్ఞను ఉల్లంఘించినవారలు దండించబడుదురనికూడ ఆజ్ఞలో తెలుపబడినది.

---

# బొంబాయి అంధకారం

షైనివయాస్సి గుర్బి ఫ్రిప్రెస్సువారు 3 డిసెంబరునాటి సంపాదకీయములో ఇట్లు వ్రాసినారు.

బొంబాయిలో విద్యుత్తు దీపాలు వీధులలో ౧౦గంటలకంతా తీసివేస్తారు ఎందుకు. నేలబొగ్గు దేశములో తగ్గినందుకుగాను దేశమునుండి నేలబొగ్గును బయటికి చాలా పంపుచున్నందులకే! యుద్ధానికిగాను ఇండియా నేలబొగ్గు ఇండియా స్త్రీలు కావలెనట. ఇండియాకు బయటినుండి పుస్తకాలు, మందులు, తిండిధాన్యాలు తెచ్చుటకు ఓడలలో స్థలమే లేదట! కాని బ్రాండీ సారాయి బుడ్లు, బైస్కిళ్లు తెచ్చుటకున్నూ, మన నేలబొగ్గు మనబట్టలు దీసుకొనిపోవుటకున్నూ ఓడలలో స్థలమున్నదట! ఇండియాకు చాలా అవసరమైన రాతిబొగ్గును పంపుచున్నారు. దానివల్ల బొంబాయిలో చీకటి జేశీపరిశ్రమలకు క్షామం సంభవించుచున్నది.

---

# భారత దేశ రక్షణ నియమపు దుర్వినియోగము

## ప్రధాన న్యాయమూర్తి ఆక్షేపణ

సంయుక్తరాష్ట్రంలో పండిత వైద్యనాథ్ అను ఆగ్రానగరపు అడ్వొకేటును అరెస్టుచేసి బంధములో నుంచగా, వారిపక్షమున అలహాబాదు హైకోర్టు వారికి అఅడ్వొకేటుచ ఎందుకుగాను అరెస్టుచేసి నట్లో తెలిసికొని అన్యాయమన్నచో కోర్టువారే స్వయముగా న్యాయమును ప్రసాదించవలసినదని ఒకదరఖాస్తు పెట్టుకొనబడినది. ఈ దరఖాస్తును గురించి హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగారు ఉభయపక్షాల వాదములను విన్నతర్వాత తీర్పు చెప్పుటకు ముందు పోలీసు చర్య నాక్షేపించుచు పోలీసులు ఒక్కొక్కప్పుడు వకీళ్ళ హక్కులను భంగపరచుటకై భారతదేశరక్షణ నియమాలలో ౨౬.నియమమును దుర్వినియోగము చేయుచున్నారని తమకు దృఢమైన అభిప్రాయ మేర్పడినదని చెప్పిరి.

---

# ఇండియా ఉద్యోగాలలోని దక్షిణాఫ్రికావారు

## రాజీ నామాల నిచ్చినారు

బర్మానుండి వచ్చివేసిన ఇద్దరు దక్షిణఆఫ్రికావారలకు ఇండియాప్రభుత్వమువారి భూగర్భశోధన శాఖలో ఉద్యోగము లీయబడియుండెను. వారలిపుడు రాజీనామాలనిచ్చినట్లును, ప్రభుత్వమువారు వాటినామోదించినట్లును తెలియుచున్నది.

వారలనుగురించి గడచిన నవంబరునెలలో కేంద్రశాసనసభయగు అసెంబ్లీలో ప్రశ్నలువేయబడగా, విదేశాలలోని భారతీయులను గురించి విచారణచేయు ఇండియా ప్రభుత్వశాఖయొక్క మంత్రియైన డాక్టరుఖారేగారు జవాబిచ్చుచు ఇయిద్దరు దక్షిణఆఫ్రికావారలలో ఒకరు మేవారు సంస్థానమందు సీసము, తుత్తునాగములను లోహములు భూమిలో ఎక్కడదొరకునో పరిశీలించు పనిలోనుండిరనియు, వారికి నెలకు రూ౧౫౦౦ జీతమీయ బడుచుండెననియు. రెండవ దక్షిణ ఆఫ్రికావారు రాజపుటానాలో అభ్రకమును గనుల నంతటియు పనులలో తోడ్పడుచుండిన గనుల యింజనీరుగానుండెననియు. అతడు ఇప్పటికంటె ఎక్కువ అభ్రకమును గనులనుండి తీయు విషయములో తోడ్పడుచుండెననియు,అతనిజీతము నెలకు రూ౨౦౦౦లు అయియుండెననియు చెప్పిరి. దక్షిణఆఫ్రికాలో యూరపీయులుండు చోట్లలో భారతీయులుండరాదని నిషేధించు శాసనమును చేయుటకుపూర్వమే ఈయిరువురును ఇండియాలో ఉద్యోగాలయందు నియుక్తులైరనియు ఖారేగారు చెప్పిరి.

---

## తుర్కీ భూకంపపు మరణాలు

తుర్కీలో భూకంపమువల్ల మరణించినవారి సంఖ్యను లెక్కించుచుండగా అది డిసంబరు౧తేదివరకు ౪౦౦౦ అయినదనియు, గాయపడినవారల సంఖ్య ౩౦౦౦అయినదనియు అంకారా రేడియోలో నవంబరు ౩౦తేదిన తెలుపబడినది.

---

# గోలకొండ గ్రంథాలయం

## రాయలసీమ

కర్త:—గొట్టిపాటి సుబ్బారాయుడు గారు.

వెల రూ౧-౦-౦, పుటలు. ౧౨౦, ప్రకాశకులు నమ్మాళ్వారు, అగ్రహారం. గుంటూరు.

ఇది చాలామంచి గ్రంథము. కర్నూలు కడప బళ్ళారి; అనంతపురము చిత్తూరుజిల్లాలనుపూర్వము నిజాంసర్కారు ఇంగ్లీషుకంపెనీకిదత్తముగా యిచ్చినందున దత్తమండలిఅనే వ్యవహారం మొన్నటివరకుండినది "ఉత్తర సర్కారు"వారు ఔరసులా? మేముదత్తులమా! అనియీజిల్లాలకిప్పుడు రాయలసీమఅని పేరుపెట్టినారు. ఈజిల్లాలలోని సకలవిషయాలు టూకీగా ఇందువ్రాసినారు, "ఒక జాబు" ఇందు ఎందుకుముద్రించినారో తెలియదు. రాయలసీమలో ప్రాచీనకవులు నాచన సోమన అయ్యలరాజు రామభద్రుడు, రామరాజభూషణుడు, కదిరీపతివంటివారు చాలాగొప్పవారుండిరి. ఇప్పటివారిలో శ్రీగాడిచర్ల హరిసర్వోత్తమరావు, కోటిరెడ్డిప్రభృతుల నిందు పేర్కొనుటకు మరచినారు. తుంగభద్రాప్రాజెక్టు కథ విపులముగా వ్రాసినారు ఈప్రాజక్టుకై ఆశిన బూటకం నాటకం వంటిది మొత్తం ఇండియాలో మరెందునుప్రదర్శించలేదు. రాయలసీమవారికి అపారమైన అపచారం యీప్రాజెక్టునుకట్టనందువల్ల చేసినవారైనారు, యుద్ధానికి దినం౨౦కోట్లు వ్యయంచేస్తున్నారుగదా! తుంగభద్రాప్రాజెక్టుకు ౪కోట్లువ్యయంజేయుటకు చేతులాడకపోయెనాపాపం. రాయలసీమలో క్షామం తప్పదు వర్షముతక్కువై వ్యవసాయం లేని యీ సీమను ప్రభుత్వమువారు పరిశ్రమల కేంద్రముగా జేయవలసియుండెను, రాయలసీమవారును, తెలంగాణా రువు గ్ణములో ఇంచుమించు పోలియున్నారు, ఈగ్రంథమును వ్రాసినవారిని ప్రచురించినవారిని అభినందించుచున్నాము.

---

చందా వివరాలు
సంవత్సరము చందా 6 సాలి రూపాయిలు
ఆరునెలలకు „ „ ౩-౧౦-౦ „
బ్రిటిషిండియాలో సంవత్సరానికి కల్దారు
విడి ప్రతిక ౦-౧-౬
పాత ప్రతిక వెల ప్రత్యేకము

# గోలకొండపత్రిక
# Golkonda Patrika

The only Popular Paper that reaches the masses in the Dominions
BEST MEDIUM — FOR — ADVERTISEMENT

Volu 18 — No 51 | *Published on every Monday and Thursday Hyderabad Dn* | 9—12—1943


## ధోకా

"ఆశలిబాభకే అల్లాదువున్న బెంగాలు పోదరుల సహాయార్థమై వుస్మానియావిశ్వవిద్యాలయ విద్యార్థులు ఒక డ్రామా "ధోకా" రెడ్డిహాస్టలులో బేగం జంగ్ యార్ జంగ్ గారి అధ్యక్షతక్రింద నావ బహమన్ (౧౩వ డిసెంబరు) ౧౩౫౩ ఫసలీ నాడు రాత్రిగంటలకు వేయుచున్నారు.

అన్నదమైనదాన్ని మరియు కామిల్ చూడండి ఆనందం పాటలువినండి

పాట్లు ఒక పేరుపొందిన డ్రామానుండి గ్రహింపబడినది.

పాత్రధారులు:—

సుదర్శన్, రహమత్, నరీన్, సత్యనారాయణ బాబుదేవు, సత్తార్, మునీర్, టిక్కెట్లువివరము: రు ౩-౦-౦ రు ౨-౦-౦ రు ౧-౦-౦

నోటు: టిక్కెట్లు నేటినుండి రెడ్డిహాస్టలులో అమ్మబడును.

———

సి. రాజగోపాలచారిగారు పూర్వమద్రాసు ప్రధానిగారు ౧౯౪౪ జనవరి నెలలో ఉస్మానియా విశ్వవిద్యాలయ స్నాతకోపన్యాసమును ఇచ్చుటకంగీకరించినారు.

* *

బేగంపేట: నవాబుగారు నవాబు సాహేబు ఛత్తారిబహద్దరు గారి అతిధిగా హైదరాబాదునగరమును చేరియున్నారు. వివిధనవాబులు వారికవిందు లిచ్చిరి. విద్యార్థులాన్ని అంకించిరి. స్త్రీల యొక్క తులను చూచుటకై వారు వెంచేసియున్నారని తెలియవచ్చినది.

## ఆక్షేపణీయ వాక్యాలకు జెయిల్

హైదరాబాదు నాయకులగు దేవరాం దారంజీ షాహీ గారున్నూ, మోతీలాల్ గారున్నూ, ప్రాణేశాచారి గారున్నూ గత మాసం నగరంలోని హిమ్మతుగంజిలో యుపన్యసించుచు ఆక్షేపణీయముగా మాట్లాడినారని ప్రభుత్వమువారు వారిని నగర న్యాయస్థానములో విచారింపజేసిరి. అచ్చట పై ముగ్గురికి తలా ఆరు నెలల జెయిలు శిక్షను తలా ౧౦౦రూ॥ అపరాధమున్నూ, అది చెల్లించకపోతే మరిమూడునెలలు జెయిలు గాలి తీయుచుండునట్లు శిక్షలు విధించిరి.

———

చీనానుండి కొందరు మన దేశములో వ్యవసాయపద్ధతులను పరీక్షచేసిపోవుటకు వచ్చినారు. వారు ఉత్తర హిందుస్థానములో చూచి యిప్పుడు హైదరాబాదుకువచ్చి హిమాయతుసాగరు చూచినారు. నిజాంసాగరుకు వెళ్ళినారు. తిరిగివచ్చి గుంటూరు కోయంబత్తూరుకు వెళ్ళి తర్వాత జనవరి ౧౯౪౪లో తమ దేశానికి వెళ్లుదురు. చీనాలో జపానుతో యుద్ధమేర్పడినప్పటినుండి వ్యవసాయం చాలా వృద్ధియైనదనియు యీ మూడేండ్లలో ౭౫ లక్షల రూపాయిలను ప్రభుత్వము వ్యవసాయముపై ఎక్కువగా వ్యయము చేసినదనియు క్రొత్త పద్ధతులపై కృషి చేయించుచున్నదని తెలిపి.

* *

హైదరాబాదు పరిశ్రమ ప్రదర్శనాన్ని బాగా ఆసక్తితో చాలా పెద్దవారు చూచుచున్నారు. ఘ. వ. బీరారు యువరాజుగారు ఘ. వ. బీరారు యువరాణీగారు ఇతరనవాబులు నవాబుకుమారులు కుమారెలు తిలకించినారు. జనులు వేలకొలదిగా ఇంతవరకు చూచినారు.

* *

హై. ప్రభుత్వమువారిట్లు ఆజ్ఞాపించినారు: ఇకముందు సెలవు తెలిని యెవరున్నూ హౌజ్ హూకాని, యియర్ బుక్కులు కాని సాల్నామాలు కాని ప్రకటింపగూడదు;

* *

ఇంకా ఒకటిన్నర నెలతర్వాత హైదరాబాదులోను ఒరంగల్లు నగరంలోను తిండికొలత ప్రారంభింపనున్నదని తెలియుచున్నది.

## బరోడాతో చేరే చిన్న సంస్థానాలు

ఇండియాలో పెద్దసంస్థానాలతో వాటిప్రక్కనుండు చిన్నసంస్థానాలను కలిపివేయు ప్రయత్నములో బరోడాసంస్థానముతో చేర్చదలచిన చిన్నసంస్థానాల మూడవపట్టిక ప్రకటితమైనది. ఈపట్టికలో బిల్కా, వాడియా, బజానా, మనాసు, మల్పూరుసంస్థానాలున్నవి.




Printed and Published by G. Kamalakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad-Dn. Editor S Prathap Reddy, B.A., B.L.